# కృషీవలుఁడు

ఇది

దువ్వూరు రామిరెడ్డిగారిచే

రచియింపఁబడి ప్రకటితమైనది





ఆంధ్రపత్రికా ముద్రాక్షరశాలయందు ముద్రితము.

౧౯౧౯

# అంకితము

శా. అన్నా! మన్నెము శేషురెడ్డి! యెటులో
యావిర్భవం బొంది స్నే
హౌన్నత్యంబు పరస్పరంబు రమణీ
యానేకభావంబులం
జెన్నారెన్ హృదయానుబంధరచనా
చిహ్నంబుగన్ మాయుపా
యెన్నండుం దలచూప దిందనుక దై
వేచ్ఛాప్రభావంబునన్.

తే.గీ. అట్టి నిర్మలమైత్రికి నానవాలు
నవ్యకవితాసుమంబుల దివ్యమాల
నెమ్మిఁ గీలించుచున్నాఁడ నీదుకీర్తి
కామినీకంఠసీమను గాంతు లొలయ!

ఇట్లు

మీ ప్రియమిత్రుఁడు

దువ్వూరు రామిరెడ్డి

# కృషీవలుఁడు



సమయ మమూల్య మొక్కనిమి
షంబు వృథాచనరాదు మర్లఁ; ద
న్నిమిషపరంపరాశకట
నీతమ యాయువు గాన నిద్రమాం
ద్యముఁదొలఁగించి మీపనుల
నారయుఁడో జనులంచుఁ దామ్రచూ
డము 'కొకొరొక్కొరో' యని
మెడన్నిగుడించి తెమల్చికూసెడిన్. ౧

మ. తనసామ్రాజ్యము నాక్రమించి ప్రజ నిద్రాశిక్షబంధించికా
లనిధిన్ద్రోచు తమోమలిమ్లుచుని నేలంబాయ బోధింపఁగా
నినుఁడంపించిన రాయబారియనఁ గాంతీడ్యస్థితిన్ దూర్పుది
క్కునశుక్రుండుదయిన్చెఁదమ్మిపువుఁదేకుల్విప్పఁగ న్దద్దినాన్

చ. జననమునొంది లౌకికపుసౌఖ్యములెల్ల భుజించి జీవబం
ధన మెరయంగ మర్ల జననంబునుబొంద గతించు ప్రాణికో
ట్లను బురణించుచున్ నిశవిలాసములంజరియించి యంతరిం
చెను నిపుడొక్కటొక్కటిగఁ బెన్నతితారకలోకసంబునన్

తే. ఉషసియను కాఁపుటిల్లాలు హొన్నురాజ
నముల వరియెన్నుగంప గేహమునదింప
సంబరంబున నెగురుచు సరసఁజేరు
పిల్లలనఁ బక్షికులములు వింటికెగసె! ౪

చ. అరుణమయూఖముల్వొదలి యంబుజషండవికాసకారణ
స్ఫురణముఁజూపు ప్రొద్దువాఁడు పుందరుణంబున నీటికోసమై
సరసులకేఁగు కాఁపునెఱజాణల నూపురమంజులార్భటుల్
పరఁగెను బాన్థయౌవనుల భావములన్ రసమంకురింపఁగన్.

చ. ఇరువులఁ జూరులందుఁ జరియించి తమోహరణైకదక్షభా
స్కరకిరణాళి నిమ్మృదులశయ్య సువర్ణమయంబుచేసె ని
ద్దుర నిఁకనైన మాని వెలిదోలుము బీళ్లకునాలమంద ని
త్తఱిఁదమిదీఱ మేయుఁ బులిదన్టులు కమ్మనిమన్చుపచ్చికల్.

తే. ఓయికర్షక! యెంతప్రొద్దాయెఁ జూడు
మింత నిదురేల? పాలకై గొంతురాయ
లేఁగయాదూడ పలుపును లాఁగికొనుచు
నఱచుచున్నది 'యంభ యంభా' యటంచు. ౭

తే. పొదుగునిండుగఁ బాల్చేపి గుదులు త్రెంపి
దూడకై దొడ్డిగోడ రాపాడిదాఁటెఁ
దఱిపిపెయ్య; యింకేల మాంద్యమునఁ బొరల?
లెమ్మునిద్దుర, పాల్దీయఁ దెమ్ము చెంబు. ౮

తే. బిఱ్ఱుకడుపుగ నన్నంబుఁ బెరుగు గుడిచి
దొడ్డి వెడలించు చున్నాఁడు గిడ్డిగములఁ
దమ్ముఁ గుఱ్ఱఁడు ; లేదూడ లమ్మలకును
బరుగులిడనీక కట్టుము పలుపువెట్టి. ౯

తే. చెమగు ముత్యాలు చెక్కిళ్లఁ జెదరి జాఱ
ముద్దుచన్నులు పయ్యెద మురిపెమాడఁ
గంకణమ్ములు మధురనిక్వాణము లొలయ
దధిమథించెడు కాంతగీతములు వినవో! ౧౦

తే. దేవళంబుల గంటల రావములును
స్నానముల కేఁగు విపుల సామరవము
పెరుగునమ్మెడు గొల్లగుబ్బెతల పిలుపు
బడుగుదాసరి సంకుశబ్దంబు వినవో! ౧౧

ఉ. ఉయ్యెలనిద్ర లేచి తనయుం డెదుటన్ జనయిత్రిఁ గాంచకే
కుయ్యిడుచున్నవాఁడు కులుకున్గనుదమ్ముల బాష్పబిన్దులో
య్యొయ్యనఁ జిన్దువాఱ సతియు న్నికటమ్మున లేదు; లేచియు
బ్బయ్యను నెత్తి మేనుపులకాన్కితమౌనటు ముద్దువెట్టుమా.

సీ. చలికప్పుగప్పి విచ్చలవిడి లేమెండఁ
గ్రాగు ముద్దులకూఁతుఁ గౌఁగిలించి
పునికి దోఁగాడుచు బొమ్మలతో నాడు
పసిబిడ్డ మోము చుంబనము చేసి

మెల్లిదంబుగ దనయిల్లాలు పలుకుచు
నవ్వినందుకు మాఱునవ్వునవ్వి
పనివాండ్రువచ్చియుండినఁ దండ్రియేమను
నో యనుశంక లో నొరసికొనఁగఁ

జలిదికడుపారఁగుడిచి యెద్దులను దోలి
కొనుచు మడికేఁగుచున్నారు గనుమ యొరులు!
వారు నీతోడివారలుగారె? రెడ్డి
యువకు లెచ్చటఁ గొఱగాక యుందురయ్య? ౧౩

చ. మనపనిఁజేసికొన్న నవమానమె? ప్రాచిపనుల్వొనర్చుచున్
వనిత యతిప్రయాసమునఁ బర్వులిడం గనుఁగోవె? కావడిం
గొని సరసీజలంబులను గోపముసేయక తెచ్చియిచ్చి కాం
తనుబరితోష పెట్టుము వృథాచన వెప్పుడునట్టిసాయముల్.

ఉ. సోమరిపోతవై జనకుసూక్తు లలక్ష్యముసేసి, కొంటె పో
రాములఁ బ్రొద్దుపుచ్చకు,ధరన్నిరతంబును సస్యవంతముం
గా మహిమన్రచింపఁగల కాఁపులు సోమరులైన లోక మిం
కో మెడువార లెవ్వరు? రసోత్కట భోజ్యపదార్థదాతలై.

తే. అరుణకిరణుండు తూర్పున నవతరింపఁ
బ్రకృతియెల్లను మాంద్యమ్ముఁబాసె; నింక
నింటనుండుట మర్యాదయే కుమార?
చలిదిచిక్కంబుఁ గట్టుము పొలముఁజేర. ౧౬

సీ. సద్య స్సముత్ఫుల్ల సారసామోదంబు
నాసికేంద్రియతర్పణముగ వెడల
హిమబిందుమౌక్తిక రమణీయమై శాద్వ
లంబు నేత్రాప్యాయనం బొనర్ప
సరసి వీచీడోల స్వచ్ఛందముగ నూఁగి
యనిలంబు లమృతసేచనము సేయ
నీడోద్గతంబులై పాడెడుపక్షుల
రవములు కర్ణపర్వములుగాఁగ
నరుణుఁ డుదయింప హృదయమోహనము నొనర్చు
నఖిలవస్తు ప్రదర్శనం బలవరించి
ప్రకృతి యాహ్వానమునుబంపెఁ బ్రాణితతికి
రమ్యదృశ్యంబుఁ గనుము కర్షకకుమార! ౧౭

చ. పొలముల కేఁగుపల్లెతలు పుత్తడిగాజులు ఘల్లుమంచు రా
పిలి యులివెత్తగం జిటికెవేయుచు నిన్నని యేలపాటలం
జెలువుగఁ బాడ, నుప్పతిలుసిగ్గున నూరకపోక మాఱు పా
టల నెలుగెత్తిపాడుము! మిటారుల నవ్వుల కాస్పదంబుఁగన్.

తే. గ్రామవాసుల కిట్టి నిష్కైతవంపు
ముగ్ధపరితోషములు సుఖభోగ్యములగుఁ
బట్టణ నివాసకుల శుష్కభావములను
నిట్టిసామాజికానంద మొసఁగఁ గలదె? ౧౯

తే. కాఁపులెల్లరు నాగళ్ళుగట్టి నేల
దున్నుచున్నారు గనుము నీ దున్నలేల
యింకఁ గయ్యలఁ దోల వదేటియాల
మోయి! లేయెండ నిశితమై యుక్కవెట్టె. ౨౦

తే. శ్రమలు లేకయె ఫలములు దుముకఁబోవు
పిండికొలఁదియె రొట్టె, యోపినవిధానఁ
గష్టపడుము కృషీవలా! గలుగు సుఖము
లుత్తయాసలకన్న మే లుద్యమంబు. ౨౧

తే. అర్కబింబము మధ్యందినాతపంబు
గాయుచుండెను మేనెల్లఁ గమలిపోవ
నురుగుఁగ్రక్కుచు నూర్పుచు నోరుదెఱచి
యొక్కయెడుగైనఁ బెట్టవు దుక్కిటెద్దు ౨౨

ఖరకరతాపతప్తమయి కాయము ఘర్మకణాళిసినుచుచుఁ
సొరిగెడి సత్త్వహీనముగఁ జూపులు దీనములయ్యెఁ బ్రొద్దునం
బారసిన మోము తేటలెటువోయెనో! దప్పియు హెచ్చెనోయి యి
త్తఱిఁ దరుమూలశాయివయి తాపమువాయుము చల్లనీడలన్.

తే. కరముఁగష్టించు నినుగాంచి కనికరమున
నెండవేడిమిఁ దొలఁగించు నిచ్ఛతోడ
వారిదం బాతపత్రమై వచ్చెఁ గాని
మారుతాహతి శిథిలమై మరలెనదియు ౨౪

చ. తరువులఁ గోటరంబులకుఁ దారెను బక్షికులంబు, బత్తెలున్
సరసులఁ జొచ్చె రోజుచుఁ, గనంబడ రెవ్వరు దారులందు నీ
సరణి సచేతన ప్రకృతి చల్లదనంబున కాసచేయ మే
నెరియఁగ నీవుమాత్ర మిటు లేల శ్రమించెద వెట్టయెండలన్

ఉ. పాటల వేడిదుమ్ములకుఁ బాదములం జిఱుబొబ్బ లెత్తఁ గ్రీ
యూటగఁ జెమ్మటల్మొగమునుండి దొరగ్గఁగ గూటిదుత్తతోఁ
పాటలగంధి వచ్చెడిని పాపము! వేగమ నీటమున్గి య
చ్చోటనె మజ్జిగన్నము రుచుల్వచియించుచు నారగింపుమీ.

మ. తరుణీ! ధూళులఁ గాళ్లు గాలెనని సన్తాపమ్మునం గాన్తునిం
జిరు ముత్తాడుచుఁ గోపగింపకు మనశ్ఛిద్రంబులం బాసి యి
ద్దఱు కష్టింపఁ గుటుంబరక్షణము సాధ్యంబౌను లేకున్న ని
ర్భరవాతాహతిభగ్నమై మునుఁగు నావల్వోలు సంసారముల్

తే. అతుల సంసారసాగరమందుఁ గాల
జలము సుకృతదుష్కృతవాత చలితమగుచు
సుఖవిషాదతరంగముల్ సుడియుచుండ
పడవవై నడిపింతువు పతిని గృహిణి! ౨౮

చ. వెలగల రత్నభూషలను వేలకుఁ దాల్చిన, నిన్నుఁ గాంచుచోఁ
గలుగదు ప్రేమ భర్తకు వికస్వరహాస వదనారవింద మం
దొలికెడు ముద్దులేనగవు లొక్కని మేషము దోఁపకున్న భూ
షలు ప్రణయానుబంధసదృశమ్ములుగావు కులాంగనాళికిన్.

చ. సిరిగల యోఁడుబిడ్డలు విచిత్రపు జాల నగ ల్ధరించి బం
గరుసరిగంచు చీరలను గట్టి చరింపఁగఁ గాంచి యాసఁలో
బారయకుకృత్రిమంబులగుభూషలుదాల్పనమూల్యరత్న మా
సరసపుఁబ్రేమ చిత్తజలజంబువెలుంగ నలంకరింపుమా!

చ. పొలమునఁగన్పిగా మొలిచి పువ్వులుపూచెడు కేతకన్పలు
జ్వలకుసుమోపహారములు పత్రపుటన్పలనున్పిమారుతా
చలితకిసాలయోచ్చలనచాతురిఁ బిల్చెడుఁ జేరఁబోయి త
త్కలికఁబరిగ్రహింప్పియొడికమ్మునఁగొప్పునఁ జెక్కుమన్గనా.

శా. పూవుందేనియలారగించి మధుపవ్యూహమ్ము కర్ణప్రియం
బై వర్ధిల్లు మనోజ్ఞగీతముల రాగాలాపముం జేయఁగా
నీవేలా?కలర్షుంకృతిన్ స్వరములెత్తేనైక్యముంబొందఁగాం
తా! వాకో వాకపల్లెటూరిపదమైనం జిత్తముప్పొంగఁగన్.

చ. శ్రమకుచితంబుగా ఫలముసంధిలదోయని చింతవొందకో
రమణి నిదాఘతాపముదొఱఁగ్గెడునంతకుమల్లియూడజొం
పములయుమాలలూఁగిపదమాత్రననిప్డికిఁబొమ్ము పాలకై
కుములుచునేడ్చునేమొయనుగున్నసిబిడ్డఁడునిద్ర లేచుచున్

ఉ. దారిఁజరించుచున్నపుడు దగ్గఱనున్న తటాకమందు నిం
పారు సరోజముల్గొని గృహంబునకుంజనుదెమ్ము యర్భకుం
డారమణీయపుష్పముల నచ్చెరువొందుచుఁగాంచియాడుకోఁ
దీఱిక వంటయింటి పనిదీర్చుమ కాంతుఁడువచ్చునంతకున్.

ఉ. ఈయెడ నాతపంబు శమియించెను నీడయుఁ దూర్పుదిక్కుకుం
బోయెను భర్తతో నలిగి పొందెడయంజను ఛాయపోలికన్
వాయువు సుప్రసన్నమయి పైఁబయి వీచెను లేచిరమ్ము లే
దోయి! విలంబనంబనెడి యుక్తి కృషీవలవాఙ్మయంబునన్.

చ. మనుజసమాజనిర్మితి సమంబుగ నీకొక ముఖ్యమైన వృ
త్తినియత ; మట్టిధార్మికవిధిం జిరకాలము గౌరవంబుతో
మనిచిరి నీపితామహు లమాంద్యసుశీలురు సర్వవృత్తిపా
వనకృషిజీవనైకపరిపాలన లోకహితార్థకాంక్షులై. 36

చ. అనుదినమిట్లు కష్టపడ నావిధి వ్రాసెనటంచు నీమదిం
బనవకు కర్షకుండ! యిలపై జనియించినదాది చెమ్మటల్
దొనకశ్రమించి పౌరుషముతో బ్రతికించెను నీకుటుంబమున్
మనమునఁ గైతవాశయము మందునకైనను లేదు నీయెడన్.

తే. నేలనూతుల కుగ్గాలు నిలుపువారు
బోడితలకు మోకాళ్లకు ముడులు వెట్టు
వారుఁ జటికెలఁ బందిళ్లు పన్ను వారు
నిన్నుఁబోలరు తమ్ముఁడా! యెన్నఁడైన. ౩౭

చ. పరువులుఁబట్టెమందములుఁ బట్టుతలాడలునంబరంబు లుం
గరులుమరన్నముల్ ప్రియయుగాన్పునమున్నటివేమియున్డినన్
ధరసకలంబు సొంతమయినం దనివోదు మనుష్యతృష్ణ, త
త్పరిచితులైన వారి నెడఁబాయదె తృప్తి నిసర్గశత్రుతన్.

శా. అన్నా! హాలిక! నీదుజీవితము నెయ్యంబార వర్ణింప మే
కొన్న న్నిర్ఝరసార వేగమున వాక్పూరంబు మాధుర్యసం
పన్నంబై ప్రవహించుఁగాని యితరుల్భాగ్యాశులై యీర్ష్యతో
నన్నుం గర్షకపక్షపాతియని నిందావాక్యముల్వల్కరే?

చ. వనలతయైన నాకవిత పత్రపుటంబులఁ బూవు రెమ్మలన్
దినదినజృంభమాణమయి తేజరిలెన్ సహజప్రరోహవ
ర్ధన నియమానుసారముగఁ దల్లత యెన్నఁడుఁ దోఁటమాలిపా
ణిని గనుగోని వన్యరమణీయతఁ జిల్కు నపూర్వపద్ధతిన్.

తే. పంజరంబున వసియించు పావురంబు
అడ్డుకమ్ములదాఁటంగ నాసచేయు
నటు బహిర్నియమంబుల నతకరించి
మన్మనంబు స్వాతంత్ర్యసీమకుఁ జరించు. ౪౨

తే. కాన నెవరేమియనుకొన్న దాననేమి
గలుగుఁ? గాల మనంతము; ఇల విశాల;
భావలోకము క్రమముగాఁ బడయు మార్పు;
నేల హృదయంబు వెలిపుచ్చ నింతయళుకు? ౪౩

తే. సైరికా! నీవు భారతక్ష్మాతలాత్మ
గౌరవపవిత్రమూర్తివి! శూరమణివి;
ధారుణీపతిపాలన దండమెపుడు
నీహలంబుకన్నను ప్రార్థనీయమగునె? ౪౪

తే. దైనికావశ్యకమ్ముల దాఁటిపోవ
వెగుర ఱెక్కలురాని నీయిచ్ఛలెపుడుఁ
బైరుపచ్చలె యవధిగాఁ బ్రాఁకుచుండు
నీవిచారము నూహయు, నిపుణతయును. ౪౫

తే. ప్రొద్దువొడిచినదాదిగాఁ బ్రొద్దుగ్రుంకు
వఱకుఁ గష్టింతువేగాని యిరుగుపొరుగు
వారిసంపదకై యీసుగూరఁబోవ
వెంత నిర్మలమోయి నీ హృదయకళిక ! ౪౬

తే. పల్లెయెల్లయె సర్వప్రపంచసీమ
ప్రియయొకర్తయె రమణీయవిగ్రహంబు !
బంగరుంబంటపొలములే భాగ్యనిధులు !
అనుదినపరిశ్రమమె మతమగును నీకు ! ౪౭

తే. ఉండితిన్నను లేకపస్తున్నఁగాని
యాసచేయవు పరులకష్టార్జితంబు
నాకలెత్తఁగ నీపంచకరుగు నతిథి
తినక, త్రావక, పోయినదినములేదు ; ౪౮

తే. కృషి సకలపరిశ్రమలకుఁ గీలుచీల ;
సత్పరిశ్రమ వాణిజ్యసాధనంబు ;
అఖిలవాణిజ్యములు సిరికాటపట్లు ;
సిరియె భోగోపలబ్ధికి జీవగఱ్ఱ ; ౪౯

తే. కావునఁ గృషీవలా! నీవె కారణమవు
సాంఘికోత్కృష్టసౌభాగ్యసౌఖ్యములకు,
ఫలమనుభవించువారలు పరులు; నీకుఁ
గట్టఁ గుడువను గఱవె యెక్కాలమందు. ౫౦

మ. ఫలము ల్మెక్కెడి వారుతత్ఫలరసాస్వాదక్రియాలోలురై
పలుమారమ్మధురత్వము న్నుతులసంభావింతురే గాని త
త్ఫలహేతుక్రమవృక్షముందలఁప రెవ్వారైన నట్లే,రమా
కలితుల్భోగములన్భుజించుచువృథాగర్వంబునన్స్వీయసౌ
ఖ్యలతావాపకులౌకృషీవలుల నెక్కాలంబుఁజింతింతురే?

ఉ. అట్టికృతఘ్నులన్ మనమునందుఁ దలంపక సేవ్యభారసం
ఘట్టన నస్థిపంజరముగాఁ దనువెండినఁగాని, వర్షముల్
పట్టినఁగాని, క్షామములు వచ్చినఁగాని శరీరసత్త్వమే
పట్టుగస్వశ్రమార్జితము పట్టెఁడునన్న ముఁదించువెప్పుడున్

తే. రాజకీయప్రపంచసామ్రాజ్యమందు
శౌర్యఖడ్గంబులకు లేదు శాసనంబు,
సంఘరాజ్యంబునేలు విస్తారశక్తి
సతము నాచారఘోరపిశాచరాజు; ౫౩

తే. శౌర్యమునకును నాచారచక్రమునకు
మధ్య, లోకంబు దవిలి సన్మథితమగును;
గాలగర్భంబునం దెట్టి ఘటనగలదొ?
పూర్వపద్ధతి విప్లవస్ఫురణఁగోలుప! ౫౪

తే. కల్యకాంతికి ము న్నంధకారరాత్రి
వర్షపాతంబునకు మున్ను వారిదముల
ఘమఘ మాడంబరంబులు నమరు; నిదియుఁ
బ్రకృతిభావంబునకు నూత్నపథముగాదు. ౫౫

తే. కష్టసుఖముల నీచోచ్చగతులుగలవు
చక్రదండంబులకుఁబోలె; సమయమందు
నిట్టిమార్పు లనంతమై యెసఁగుచుండు;
భావిపరిణామ మెవ్వరుపలుకఁగలరు! ౫౬

తే. ఓ కృషీవలా! నీవుకష్టోత్కటంపు
దుర్భరావస్థయందె తోదోపువడగ
నెవరు శాసించువారు? నీకేమికొదువ?
యాత్మవిజ్ఞానమయముగా నలవరింపు. ౫౭

శా. దారిద్ర్యంబను పెల్లుటేటికెదురై దాఁటం బ్రయత్నించుచుం
బూరావేగమునంజలించి వెనుత్రోపుల్వోవుకాంక్షోత్కటం
బేరాపొందక నెట్టుతెడ్లగు మనస్స్వేచ్ఛాప్రకారంబుఁ గా
ర్యారంభంబును, ధైర్యమున్విడకుమయ్యా! నీవు వేయింటికిన్

తే. రార! సైరిక! గనుగొమ్ము రమ్యమైన
సస్యకేదారఖండంబు; సత్కవీశ
భావలోచన మెఱవుగాఁబడయకున్నఁ
గాంచనేర వంతర్లీనకాంతిసరణి; ౫౮

మ. అనిలాలోలవినీలసస్యములు భంగానీకము ల్గాఁగఁ దె
ల్లనికొంగల్ పయిఁదేలుసంకులుగ లీలన్మీంను వెన్కాఁడ, మ
ధ్యనురాజిల్లుకుజంబు లోడలుగ వాత స్ఫూర్తినూఁగాడ, స
స్యనికాయావనిసాగరంబటుల నేత్రానందముంగూర్చెడిన్.

చ. కుసుమలతావలీవలిత కుంజములం, గిసలత్ప్రకాండముల్
బసరులు గ్రక్కు వృక్షముల బాలతృణంబులఁ జేలగట్లు సొం
పెసఁగ, సమస్తరత్నముల నేరిచి కూర్చినతాలబిళ్లలన్
వసుధకమర్చిరో కృషికవర్యులనన్ వరిమళ్లుశోభిలున్;

చ. మరకతచూర్ణవర్ణముల మంజులమౌ నవసస్యభాగముం
దరతనుగాంచ వైదికశతాబ్దములన్ భరతక్షమాధురం
ధరయగు సస్యలక్ష్మి దయదప్పక నేఁటికి నార్యధారుణీ
భరణ కుతూహలస్ఫురణభాసిలునోయన నొప్పుగర్షకా!

తే. కడ మొదలు లేని నీదేహకష్టములకుఁ
బ్రతిఫలంబగు సస్యసంపత్తిగాంచి
కవివిగాకున్న వాగ్మితగలుగకున్నఁ
బ్రణుతివర్ణింపు మొకసారిభాగ్యగరిమ; ౬౩

శా. ఆకాశంబున మేఘమాలికలరూపైనం గనన్రాదు శు
ష్కాకారన్పులసస్యముల్ సుదుములైయల్లాడెఁ; దీక్ష్ణన్పుగా
సోకెంసూర్యమయూఖతాపమిఁక నేజోకన్ఫలించున్వరుల్;
మాకీకష్టము వెట్టె దైవమని యేలామాటికిం జింతిలన్?

చ. ఖరకరతాపతప్తమయి గాసిలెఁ బైరు లనంగనేల? భా
స్కరకిరణాళిలోఁ గలదు సస్యసముద్ధరణైకశక్తి త
త్కిరణము లబ్ధివారి పయికింగొని యావిరియై పునర్నభోం
తరమున మార్చు నీరదవితానముగాఁగఁ బునఃప్రవృష్టికిన్.

మ. అలవర్షాగమలక్ష్మి రేఖ యన దివ్యానేకవర్ణంబులం
బొలుపున్బొన్దు నవాబ్దమాల యదిగో భూభృచ్ఛిరోలంకృతిం
దలపించెం గనుఁగొమ్ము వాయునిహతిం దద్దేశముం బాసి కొం
గలబారు ల్వెనువెంట నంట శకలాకారంబుల న్వచ్చెడిన్.

ఉ. బావికి నీటికై యరుగు పల్లెత లంబుధరంబుఁ గాంచి య
వ్వా! వినువీథిఁ గర్షకులపాలిటిదైవము యంబుదాకృతిన్
భావిఫలోదయ ప్రకటభావమునం జనుదెంచెనంచు మో
దావహచిత్తలై సరసమాడుచుఁ బోయెదరో కృషీవలా.

తే. ప్రావృడంభోదలక్ష్మి యావాసమునకుఁ
బాఱఁగట్టిన నవరత్నతోరణంబు
నాఁగఁ గోమల శబలవర్ణములతోడ
నింద్రచాపంబు శోభిల్లె నిదిగో చూడు. ౬౮

తే. వానతుమ్మెద లాకాశపథమునందు
మధుర ఝుంకారరవములు మందలించెఁ;
జల్లగాలికి భేకంబు లెల్లమడుల
బెకబెక మటంచుఁ గూసెడి వికటరుతుల. ౬౯

తే. తటములకు నాకసమున కంతరము లేక
నీలనీరదమాలలు వ్రేలుచుంట
నేలపై మిన్ను పడనీక నిలుపుచుండు
స్తంభములనంగ గిరులు దృశ్యంబులయ్యె. ౭౦

మ. అరిదుర్గంబగు భూమి లగ్గలిడ యత్నారంభముం జేసి చె
చ్చెరదోర్వీర్యరాజ్యవికీర్ణ ఖండజలము క్సేనల్ సమీరేశుఁడో
క్కరణోర్వీన్నమకూర్పయుద్ధతుములో గ్రధ్వానమో నానభో
న్తరము ల్వ్రయ్యగ మేఘగర్జనములుత్పన్నంబులయ్యెన్ధరన్

తే. తపనుఁడంబుదాచ్ఛాదన తతులలోన
మరుఁగువడిపోవఁ గని నీలగిరులచల్లఁ
దనము భువినాక్రమించిన యనువుగాఁగ
వాయుమండలి చలిమిరివట్టి యుండె. ౭౨

మ. ఉపవాసశ్రమశుష్కచాతకచయన్బుప్పొన్నగం భాస్కరా
తపసంతప్త విశీర్ణసస్యములు శీతస్పర్శ మోదిల్లఁగా
మపురోభావులభాగ్యవస్తుల భయమ్లానత్వముల్వాయ ధా
త్రి పిపాసాతురతల్ శమిన్పగురిసెన్ వృష్టుల్ సమగ్రన్బునన్

తే. తెల్లపట్టు మస్లీనుల తెరలలోన
నాడుకొనుచుండు పసిపాప యరువుదోఁప
వానముత్యాలు గూర్చిన వలల తెరల
దినరమామణి మృదుకాంతిఁ దిరుగుచుండె. ౭౪

తే. త్రావ నీరైనఁ దొరకని తరుణమందు
నిమిషమాత్రాన దొరువులు నిండిపోవె
నఖిలలోకాశ్రయుండు కృపామృతుండు
కన్నుదెఱచిన జరుగని కార్యమున్నె? ౭౫

సీ. జల్లు పెల్లొదుగంగఁ బిల్లలు తల్లులు
నిలువఁబట్టిన నింట నిలువఁబోక
వాననీరులువాఱు పల్లపు టిసుకలఁ
గయ్యగాఁగట్టలుగట్టి చిన్న
నాగళులంబన్ని లేఁగదూడలుగట్టి
దున్నుచు విత్తులు మన్నుగలిపి
పచ్చమాకులుచల్లి పైరుపట్టెనటంచుఁ
గలుపుదీయుచుఁ గోతకాలమనుచు
వరులుగోయుట నటియించి పనలుగట్టి
కుప్పవేయుటగా మన్నుకుప్పవెట్టి
కడకు నేలచదునుగాఁగఁ గాలఁదన్ని
యాకలెత్తిన నిండ్లకు నరుగుచుంద్రు! ౭౬

మ. జడివాన న్వలివడ్డ బక్కమొదవుల్ సంఘంబులై బీళులన్
విడి యత్తాడుచు దొడ్డిఁజేర నవిగోవేగంబుగ న్వచ్చెఁ; బె
ల్లడుసులో న్వవని మిట్టనేలఁబసిఁ గొయ్యల్నాఁటికట్టించి వెం
బడివేయున్మువుగడ్డిగాదములుచొప్పల్ బొందుపుల్దంటులన్.

ఉ. తమ్ముఁడు కుఱ్ఱ, గోచయము దాటులువెట్టుచు ద్రేపుదామెనం
ద్రమ్ముచు, జిఱ్ఱకొట్టుచుఁ బరస్పరముం దల డీలుకొంచుము
న్నెమ్ములఁ జిమ్ముచుం దిరుగఁగొట్టినఁ బట్టినలొగ్గి రావు సా
యమ్మొనరింపుమీయదన నాలమరల్పఁగఁబల్లు వెట్టఁగన్.

చ. తడిసినపచ్చికట్టియలు తంగెడుతప్పర తాటియాకులుం
బడఁతుక ప్రొయ్యిలోదురిగి పైబొగలెత్తఁగ నూఁదుఁగానికూ
డుడుకదు కాఁకకుంబొగకు నుప్పతిలె న్గడగంట బాష్పముల్
తడయక చెట్టుచేమలను దట్టెడు త్రుంచుమ యెన్గు రెమ్మలన్.

మ. మును వేసంగిని గుచ్చిలడ్డ పిడకల్ బొప్పర్లుఁ గొళ్లెంబులున్
వెనుకం బెట్టిన తాటిచుండ్లు బరికెల్ వెళ్లించె నిన్నాళ్ళు నిం
క నవాంభోధర మాలికాపిహిత దిగ్జాలంబులై వర్షపుం
దినముల్ డగ్గరెఁగాంత భానసము నేతీరొప్ప సాగించెదున్!

చ. పొలముల బీళులం దిరిగి ప్రొద్దెడ గ్రుంకఁగ నిల్లుసేరి బి
డ్డల నొడిచుట్టువెట్టుక పడంతిని నన్నముఁ దెమ్మటంచు వే
పిలిచెద వొంటికాఁపురము పిల్లలగిల్లల బుజ్జగించుకో
వలసిన యాలిపాటుఁ దలపం గరుణింప వదేల హాలికా!

మ. మనసంసారము నిర్వహించుకొను సామర్థ్యంబు చేకూరినన్
ఘనసామ్రాజ్యధురన్ధరత్వమొక లెక్కా! యేమి? యీరెంటికిం
దనరున్భేదము విస్తృతిన్గుణమున న్సామాన్యముల్చూడఁగ
న్మనుజాధీశ్వరులున్ గృహస్థులును సామ్యప్రజ్ఞ లెవ్వేళలన్.

సీ. ఉప్పుతోఁ దొమ్మిదియున్న కాఁపురములు
సేయు గృహిణుల కేచిక్కు లేదు
ఎవ్వి లేకున్నను నిరుగుపొరుగు కులాం
గనలకుఁ జేయొగ్గి గై కొనుటకు
నిష్టపడక, యున్నదే పెట్టి యక్కఱ
వాపుకొనెడు మానవతుల కెందు
లేమిడి సంసార మేమెఱుఁ బరువుతోఁ
గడపంగ నిక్కట్లు గలుగుచుండు
నెన్ని కష్టములున్న నిట్లని పలుకక
పొసఁగిన యంతకుఁ బొదుపుచేసి

బిడ్డలకు భర్తకును బెట్టి ప్రీతిఁ దాను
గుడిచి యొకకడి భిక్షునకిడు పురంధ్రి
శాంతి నీతియు నురుకష్టసహనశక్తి
యెవ రెఱుంగుదు రంతటి యింతిదక్క! ౮౩

శా. ఆలుంబిడ్డలసాకఁజాల కఖిలత్యాగంబు గావించి భి
క్షాలబ్ధంబునఁబొట్టపోసికొనుచుం సంసారసౌఖ్యంబుమీ
కేలా యంచు గృహస్థవీరులను నెంతేఁ గూటవైరాగ్యబో
ధాలాపంబుల మోసపుచ్చెదరు సన్న్యాసాంకధారుల్ధరన్

తే. ప్రబలసంసార మనునది పారశాల
యందు విద్యార్థులగుచుందు రఖిలజనులు
కష్టసుఖములు గురువులు గాంచువిద్య
సహజ విజ్ఞానమయమగు. సన్మతంబు. ౮౫

మ. సకలన్బుం బరమాత్మయన్చుపనిషచ్ఛాస్త్రన్బు చాటిన్పుఁ; ద
త్సకలంబందు నిషిద్ధమెద్ది? సుతకాంతా చిత్తపద్మంబులఁ
సకలాంతర్మయమూర్తి సౌరభముచందానంబిసాళింపఁడే?
యకలన్నాత్ముల కెల్ల సృష్టిగలవే త్యాజ్యన్బులున్బాజ్యముల్

సీ. నవమాసములు మోచి నవనవాపేక్షలఁ
పెంచిన తల్లిఁ బ్రేమించకున్న
నిను సాకి సంతరించిన వృద్ధజనకుని
గురుభక్తి భావనఁ గొలువకున్న
నతిలోక మృదులహాసాంకురంబుల నీను
పసిబిడ్డకు న్ముద్దు లొసఁగకున్న
నఖిలశోకంబుల నపనయింపఁగఁజాలు
కాంత ముగ్ధాస్యంబుఁ గాంచకున్నఁ
ప్రణయమకరంద బిందువుల్ భావకుసుమ
మందుఁ జిప్పిల్లి తుంపురు ల్చిందకున్న
నీహృదంతరము పలమో లోహమయమొ!
దేవుఁ డానందమయుఁడని తెలియలేవె? ౮౭

తే. దారపుత్రకులం బ్రీతిఁ దవిలియుంట
స్వార్థపరమగు ప్రేమనాఁ బలుకఁబడును
నదియె తారతమ్యము లేక యఖిలసృష్టి
లోఁగొనంగ వైరాగ్యంబునాఁగ వెలయు. ౮౮

తే. పూవుపుష్పింప నాపయిఁబుట్టుపిందె
యనఁగ, రాగంబు నశియింప నవతరించు
నకలుష ప్రేమ, కుసుమమే యలరకున్న
ఫల మతర్కితంబుగ నెందుఁ బ్రభవమగును ? ౮౯

తే. కాన సన్న్యాసి ! సంసారి కాఁపురమున
శ్రద్ధవిడనాడునటు బోధసలుపఁబోకు
సాంఘికాభ్యుదయ శుభ దీక్షావినీతి
యతియు సంసారి తుల్యబాధ్యతవహింత్రు ! ౯౦

తే. అక్కఱనుబట్టి తారతమ్యంబుపుట్టు
వస్తు పరిణామభేదంబె ప్రకృతి యాత్మ
సాధసోపానములు వానిస్థలములందు
ముఖ్యమైనటు సర్వంబుఁ గొనరుజగతి. ౯౧

తే. ఆఱునెలలకష్టంబులకైన ఫలము
జాళువాపొన్నువరియెన్ను జడలుదాల్చు
పంటలచ్చిగ మూర్తివైభవమునొందె
ననుభవింపుము తక్కిన యాఱునెలలు. ౯౨

సీ. తల 'తాకటులు' వెట్టి ధనికులదగ్గఱఁ
బన్నుకుఁగైకొన్న చిన్నయప్పు
కూలికినాలికిఁ గూటికింజాలక
నాముకైగొన్న ధాన్యంపుటప్పు

చిల్లరమల్లర చేబదులుగఁదెచ్చి
యక్కఱగడపిన యట్టియప్పు
పండుగపర్వాల బంధులవిందుకై
సామానుగొన్న బజారుటప్పు

తే. వాయిదామించ వచ్చిన వడ్డియప్పు
భార్యసొమ్ములు కుదువకుఁబడ్డ యప్పు
వేగతీరిచి స్వాతంత్ర్య వీధియందు
సంచరింపుమ నిశ్చింత సంతతంబు! ౯౩

తే. సంఘపరివర్తనంబులు జరుగుచున్న
రాజకీయసంక్షోభంబు రగులుకొన్న
విప్లవంబులదేశమ్ము వీఁగుచున్నఁ
గృషిత్యజింపకు, కర్షకా! కీడుగలుగు. ౯౪

తే. నవ్య పాశ్చాత్యసభ్యత నాగరికత
పల్లెలందు నస్పష్టరూపములఁ దాల్చి
కాలసమ్మానితములైన గ్రామపద్ధ
తులను నశ్రద్ధభావంబు గలుగఁజేసె. ౯౫

సీ. పంచాయితీసభాభవనంబుతో రచ్చ
కొట్టంబు లోకమూలఁ గూలిపోయె;
వీథిబడులఁ జెప్పు విజ్ఞానధుర్యులు
నొజ్జలు దాస్యంబు నూఁతగొనిరి

గ్రామపరిశ్రమఁగలుగు నన్యోన్యమౌ
సహకారవృత్తంబు సమసిపోయె
సత్యజీవనము, విశ్వాసమ్ము, భక్తియు,
నైకమత్యము, మున్నె యంతరించె!
బూటకములు, కుయుక్తులు, మోసగతులు
కోర్టువ్యాజ్యాలు, ఫోర్జరీ, ల్యూటమైత్రి
స్వార్థపరత, మౌఢ్యంబు, గర్వప్రవృత్తి
నేర్పువిద్యాలయంబులు నేఁటియూళ్లు! ౮౬

ఆ. నేఁటినాగరికత నీమేలుఁగోరక
యప్పుచేసి బ్రతుకుమనివిధించు;
నాయవృద్ధికన్న నావశ్యకపదార్థ
సంఖ్య హెచ్చుఁ జిత్తశాంతియున్నె ? ౯౭

తే. జీవనస్పర్ధ సామాన్యచేష్టయైన
కాలమున వ్యక్తివాద మగ్రతవహించు
సత్త్వవిరహితుఁ డన్యభోజ్యత నశించు;
నర్హజీవియె యంతరాయములఁ దాఁటు! ౯౮

తే. కాన, జీవనసంగ్రామకార్యమందు
విజయివగుటకు శౌర్యంబు, విద్య, బుద్ధి,
సత్యసంధత, యాత్మవిశ్వాస మనెడు
నాయుధంబుల విడువకు హాలికవర్య! ౯౯

తే. చాలు విజ్ఞానమతబోధ సాంధ్యరాగ
కాంతిఁ బండినవరిచేలు క్షణములోన
స్వర్ణసైకత ఖనులుగాఁ బరిణమించెఁ
గనులకాప్యాయనంబుగఁ గాంచుమోయి! ౧౦౦

తే. అస్తపర్వత శిఖరంపు టచ్చుదిమ్మ
సమయమున హేమకారుఁడు సాంధ్యవర్ణ
కనకమునుగుద్ది జిగిపతకంబుఁ జేసె
ననఁగఁ బరిణతరవిబింబ మలరెనిపుడు. ౧౦౧

ఉ. బారులుదీఱి యంబరముపైఁ జరియించు బలాకపక్షులిం
పారఁగ సాంధ్యలక్ష్మి మెడయందు ధరించిన తారహారరే
ఖారమణీయతం జిలుకఁ గాలువనీటికి నేఁగుకన్యకల్
వారకకొంతసేపు కనువాల్పక చూతురు విస్మయంబునన్;

ఉ. గోపద ధూళి ధూసరిత గోపకుమారులుఁ గాఁపుపిల్లలున్
మూపునఁ గట్టలుం జలిదిబోనపుముత్తలు, చంకలోన పె
న్మోపెడుదూడపల్పులిడి మోహనవేణురవంబు సేయుచున్
మాపటివేళగాఁ బసులమందలఁదోల్కొని వచ్చి రిండ్లకున్

సీ. బడివిడిపించంగ బాలురు వీధులఁ
బరువెత్తి యుప్పరపట్టెలాడఁ
బంటచేలకుఁ బనిపాటల కేఁగిన
కర్షకు లిండ్లకుఁ గదలుచుండ

గఱువపొడిగందవడి - దొలఁకసుడిరేఁగుచును
మెలఁగునెలపయ్యెరలు - నలసతఁజరింపం
దలఁపున రసార్ద్రమగు - వలపులిగురింప, దిన
కలకలమడంచి, నిశ - గొలిపెఁబ్రమదంబుఁ!

తే. స్నానమొనరించి, వెన్నెలచలువబయిల
బిడ్డలు న్నిపుభార్యయుఁ బ్రీతిఁగుడిచి,
పొడుపుకతలు సమస్యలుఁ బూర్వచరిత
లంత వచియింపు వారలు సంతసింప! ౧౦౮

తే. శ్రమ, విషాదమ్ము, లాసలు, సర్వకాల
హృదయభేదకచింతలు, నిదురయ నేడు
శాంతవారిధి లీనమై సమసిపోవ
విశ్రమింపుము సైరికా! వేగువఱకు. ౧౦౯